# గోదావరీ పుష్కరము

## (స్నాన పూజాది విధానములతో)



గ్రంథయిత

బులుసు సూర్యప్రకాశము





ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

 * వెల 0-4-0

# ఒక మాట

గోదావరి, పుష్కరముల చరిత్ర, స్నాన, పూజా విధానములు పురాణమందలి విషయము లిందు అందరి కందుబాటులో నుండునటుల పొందుపరుప బడి యున్నవి. ఈ గ్రంథము చేతనున్న పుష్కర సమయమున చేయతగిన సర్వము విదితము కాగలదు.

— కూర్పరి.

జానకిరాం ప్రెస్, తెనాలి.

ఓం

# గోదావరీ పుష్కరము

## పుష్కర వృత్తాంతము

ఒకనాడు దేవర్షియగు నారదుడు తనతండ్రియగు బ్రహ్మ సమీపమున కరిగి యిట్లనెను.

ఓ మహాప్రభూ ! సర్వతీర్థముల సారభూతముగా, సర్వ పాపములకు ప్రణాశముగా నొకానొక తీర్థరాజమును నిర్మించి నీవు మున్ను ఇంద్రున కిచ్చితివని వినియుంటిని. ఆ తీర్థరాజపు పుట్టుపూర్వోత్తరములు వినవలెనని నాకు మిక్కిలి కుతూహల మగుచున్నది కావున లోకానుగ్రహబుద్ధితో నీవా తీర్థరాజ వృత్తాంతమును నాకెఱిగింపుము.

అని వేసిన నారదుని గని చతురాననుడిట్లని యనెను : నారదా ! నీవు చాల మంచిప్రశ్న వేసితివి. ఏతీర్థరాజము నొక్క మాఱు స్మరించినంత మాత్రమున జనుల యెల్లపాపములు పటాపంచలగునో, ఆతీర్థరాజపు వృత్తాంతమును లోకమంగళ కారణముగా నీవు నాచే నీనాడిటు చెప్పింప బూనితివి. సంతసము.

పూర్వ మింద్రుడు త్రైలోక్యరాజ్య మదమోహమున మత్తుడై యొకానొక అకార్యమునకు బాలుపడెను. అదెట్టిది యంటేవి, వినుము. గౌతమమహర్షి కి నేను సాక్షాత్సరస్వతీదేవిచే స్వపుత్రీనిర్విశేషముగా పెంచబడిన అహల్య యను కన్యను భార్యగా నొసగియుంటిని. ఆ అహల్యయందు కామముగలిగి యింద్రుడు అందులకు దగిన సందు వెదకుచు గౌతమాశ్రమము చుట్టుపట్టులనే అతి రహస్యముగా మెలగసాగెను. ఒకనాడు

గౌతముడు గంగానదికి స్నానార్థ మరిగిన సమయ మారసి, యిదియే తగిన సమయమని యింద్రుడు గౌతమముని వేషమున ఆశ్రమములో ప్రవేశించి, అహల్యతో గూడెను. అనంతరమాత డాకపట గౌతమముని వేషముతోడనే ఆశ్రమములోనుండి వెలుపలికి వెడలిపోవుచుండగా, ద్వారమున గౌతము డెదురయ్యెను. ఆమహర్షిని జూచి దేవేంద్రుడు భయమున వెలవెలబోయి, గడగడ వణకిపోయెను.

గౌతముడును వాని వృత్తాంత మంతయు తన యోగదృష్టి ప్రభావమున నెఱిగికొని, ఆగ్రహముతో మండి, ఓరీ! పాపీ! స్వర్గలోకాధిపతివయ్యు నీవు వివేకములేక మావంటి మహర్షులకే యిట్లు ఎగ్గులు తలపెట్టితివా ? ఇంత కామాంధ్యముతో నీకన్నులు తలకెక్కినవి. కానిమ్ము. శాపమునగాని నీ కన్నులు మరల క్రిందికి దిగవు. ముల్లోకములకు బుద్ధివచ్చునట్లు నీ అకార్యమునకు దగిన శాపమున నిన్ను ప్రతిఫలమును గుడిపించెద.

అని పలికి గౌతముడు ఓరీ! యింద్రా! కామోద్రేకమున నీవిట్టి అకార్యము నాచరించితివి గావున నీవిప్పుడిప్పుడే నీ మగతనమును బోగొట్టుకొని, శరీరమునిండ స్త్రీ లింగములు వ్యక్తములుకాగా సహస్రభగుడ వగుదువని శపించెను.

ఇంద్రు డప్పటికప్పుడే అట్లు సహస్రభగుడయ్యెను. అయినను గౌతముని వేడికొని శాపాంతమును బడయుదమన్నను నోరు మెదపిన నింకేమి కొంపమునుగునో యను భయమున నేమియు మాటాడక, తలవంచుకొని, ఒక్కపరుగున నావికృత స్వరూపముతో స్వర్గమునకు బాఱివచ్చెను.

స్వర్గవాసుల కా వికృత స్వరూపమును జూప సిగ్గుపడి యింద్రుడు వెనువెంటనే నాదరికి వచ్చి యిట్లు వేడుకొనెను :- పితామహా! నేను చేయరాని మహాపాపము నాచరించి, గౌతమ ముని శాపమునకు గుఱియైతిని. ఆ మునిచంద్రుని శాపమునకు ఫలముగా నేనిట్టి రూపు గొంటిని. ఈపాప ముపశమించునట్లు నా కేదేని యొక మహాతీర్థమును ప్రసాదింపుము. భూలోకములో గల యెల్లతీర్థములకు నేగి అందు స్నానాదుల నాచరింప నే నిప్పటున నేరకున్నాను. కావున సర్వస్రష్టవగు నిన్ను వేడుకొనుచున్నాడను. సర్వతీర్థ సారభూతముగా నాకొక తీర్థమును ప్రసాదింపుము. దానిని సేవించి నాపాపము నడచివేసికొందును.

ఇంద్రుని ప్రార్థనమును విని మనసు కరగి నేనిట్లంటిని :- ఆకాశగంగయగు మందాకినియందు పుష్కరమను తీర్థముగలదు. అందు అనుదినము స్నానాదికముల నాచరింపుము. నీ పాపము రూపుమాయును.

ఇంద్రు డందులకు మహాప్రసాదమని మరల నిట్లనియె :- పరమేష్ఠీ! నీ యనుగ్రహమున కృతార్థుడను. కాని నాకోరిక మరియొకటి గలదు. అది యీడేరున ట్లనుగ్రహింపుము. సకల పాపచ్ఛేదనముగా నీవు నాకొసగిన ఆ తీర్థవిశేషము, నావలెనే సర్వశ్రేష్ఠత్వమును పొందవలెను. స్వర్గ మర్త్య పాతాళములలో సరిలేక ఆతీర్థము నావలెనే అందరిసేవలను గొనునట్లు అనుగ్రహింపుము. అట్లే అగుగాతమని నేనును అనుగ్రహించితిని.

అది మొదలుగా నింద్రుడు పుష్కర క్షేత్రమున నను దినము స్నానమూడి కొలదికాలమునకు దనపాపమంతయు రూపుమాపుకొనెను.

అని విని నారదుడు బ్రహ్మతో ననెను:- గురువు సింహ రాశిలో నుండగా సమస్త తీర్థములు గౌతమీనదియందు వచ్చి చేరునుగదా! అప్పుడు పుష్కరతీర్థము సయితము గౌతమీనది యందు వచ్చి చేరునా? లేదా? తెలియబరుపుము.

నారదుని పలుకులు విని బ్రహ్మ, ఓయీ! ఇందొక పురాతన కథ గలదు. అది గౌతమీ పుష్కర సంవాద రూప మున నున్నది. అద్దానిని నీకు నేను వినిపించెద. సావధానమతితో నాలింపుము. దానిని వినినంతమాత్రమున ఎల్ల పాపాతిపాపములు నమసిపోవును. అని బ్రహ్మ నారదున కిట్లని వినిపింపగడగెను.

# గోదావరీపుష్కరము

ఒకప్పుడు గౌతమీనది పుష్కరతీర్థముతో నిట్లనెను :— ఓపుష్కరతీర్థమా! నీవు సర్వకాలము స్వర్గమును బాయక అందే మందాకిని యందే నిలిచిపోవు చున్నావు. అది నీకు కాణాచియా యేమి? మఱి యింకెక్కడికిని పోవుటకు తావు లేనట్లు నీవందే స్థిరనివాసము నేర్పరచుకొని యుండవలెనా? బృహస్పతి సింహరాశిగతుడైన సమయమున సమస్త తీర్థములు వచ్చి నాయందు ప్రవేశించుచున్నవి గదా! అట్టి వరము నాకు దేవదేవుని వలన సంప్రాప్తించినది. అట్టిచో బృహస్పతి సింహ రాశిగతుడై నప్పుడు నీవుకూడ అన్నితీర్థములవలెనే నాయందేల వచ్చి నిలువవు?

గౌతమి పలుకులు విని పుష్కర మిట్లనెను :- గౌతమీ! నీవనినది నిజమే. నేను సర్వకాలము స్వర్గమును వదలక అందే నిలిచిపోవుచున్నాను. ఏమిచేయుదును? బ్రహ్మగారు నాకట్టి

కట్టడ గావించినారు. నన్నాయన యింద్రుని కొఱకు సృష్టించి, అచట స్థాపించినాడు. అందువలన నేను శాశ్వతముగా స్వర్గపుర వాసినే అయినాను. అట్టి నేను ఇంకెట్లు మఱొకతీర్థమును జేర బోగలను ?

ఇంద్రునికొఱకు నిన్ను బ్రహ్మ సృజించినను, నీవు స్వర్గ పురమునే అంటిపెట్టుకొని నిలిచి, కేవల మొక యింద్రునకే ఉప యోగపడవలెనా యేమి? ఇంక నెవ్వరిపాపములను నీవు తొలగించి వేయవలదా ? పాపములు గలవారు పుణ్యములగు తీర్థములను నీవంటివానిని వెదకికొనుచు వచ్చి, స్నానాదులతో సేవించి, పాపవిముక్తి బడయనవలెనుగాని, తీర్థములు పాపుల నంటిపెట్టు కొని యుండునా యేమి ? ఇది యెక్కడిమాట ? నీ వచ్చటనే యుండవలెనని నిన్ను బ్రహ్మగాని, యింద్రుడుగాని శాసించి నవారులా ? నీవున్న తావునకే ఆ యింద్రాదులు రానవలెను. ఇది క్రమమైన మార్గము. ఇది నీవు కాదందువేని యెల్లతీర్థముల గౌరవమునకు భంగము గలిగించిన దానవగుదువు కావున ఆ అభిప్రాయమును వదలిపెట్టుము. గురువు సింహరాశిగతుడై నప్పుడు సమస్త తీర్థములు కావలెననివచ్చి నాయందు నిలుచు చున్నవి. కావున నీవుకూడ నిర్భయముగా నా సమయమున నాలో నిలువుము. భూలోకమునుగూడ పాపవిముక్తమును జేయుము. అవసరపడినచో ఇంద్రుడుకూడ ఆ సమయమున భూలోకమునకే వచ్చి నాయందు స్నానాదులొనరించును.

అంతియకాక, పుష్కరా ! మఱొకమాట బృహస్పతి సింహరాశిస్థితుడైనప్పుడు సమస్తతీర్థములు నాయందే జేరునని

గదా ప్రసిద్ధి ? అట్టిచో సర్వతీర్థములకు శిరోభూషణమవైన నీవు నాలోవచ్చి నిలువకున్నచో, ఆ సమయమున ఆ సమస్త శబ్దములో లోటురాదా ? దానిమూలమున నాకును కొంచెము న్యూనత గలుగదా? కావున సంకోచింపక నీ వా సమయమున నాలో జేరుము. నాకు పుష్కలత్వమును సమకూర్పుము. అట్లు గావించినచో నిన్ను బ్రహ్మగాని, యింద్రుడుగాని యేమియు ననబోరు. అందుకు నేను పూచీ పడగలను. ఆ సమయమున అమందానంద కోలాహలములతో వెల్లువలుగా నేల యీనినట్లుగా ఇసుకవైచినను రాలక గుంపులు గుంపులుగా దూరదూరముల నుండియు ఆబాలగోపాలముగా వచ్చి నీతో గూడియున్న నాయందు స్నానదానాదులొనరించి మనల యిరువురను సేవించు జనసముద్రములను జూచి మహానందము ననుభవింపుము. కేవలమొక యింద్రునికొఱకే స్వర్గపురమున ఉట్టిగట్టుకొని కూర్చుండి యుండక, భూలోకములోని జనులు ఆనందోత్సాహములను కన్నులార జూచి మనసార ఆనందింపుము. తనివార వారలను బుణ్యాత్ములను గావింపుము.

గౌతమి పలుకులు విని పుష్కరము మిగుల నుత్సాహపడి యిట్లనెను:— గౌతమీ! నీవు చెప్పినది చాల సమంజసముగా నున్నది. గురువు సింహరాశిగతుడైనప్పుడు వచ్చి నీయందు నిలువ నాకు నెంతయు గుతూహలము గలుగుచున్నది. అట్లే కావించెద. కాని, గురువు సింహమునందు సంవత్సరకాల ముండును గదా ? అంతదనుక నేను నీలో నిలిచియుండుట అంత సమంజసము కాదు అని నాకు తోచుచున్నది. ఏలయన — జనోద్ధరణముకొఱకై మనమింత సాహసించినను, దీర్ఘకాలము

దేవాధిపతియగు నింద్రుని, దేవజ్యేష్ఠుడగు బ్రహ్మను గాదని త్రోసిపుచ్చి, అగౌరవపఱిచినచో, మనకే వారివలన నేశాపమో ప్రాప్తించునుగదా? అట్టి దైవాగ్రహమునకు గుఱికాకుండ, నీయందు జేరు సమస్తతీర్థములలో న్యూనత గలుగకుండ, నే నొక యుపాయ మాచరించెదను. అదియేమన — సంవత్సరము నకు మాసములు పండ్రెండుగదా? మాసమునకొక రోజువంతున పండ్రెండు రోజులు నేను నీయందు నిలుతును. బృహస్పతి సింహరాశిలో ప్రవేశింపగానే నేను నీలో ప్రవేశించి, అట్లు వరుసగా పండ్రెండు నాళ్ళు నిలిచి, అనంతరము స్వస్థానమున కేగెదను.

అట్లు నేను నీలో నిలుచుటలో కారణ మొక భూలోక జనోద్ధరణమే కాదు. మఱొకటి గూడ గలదు. అది చెప్పెద వినుము. నీవు పరమేశ్వరుని జటాజూటమున మొట్టమొదటగా నిలిచిన గంగాభవానివి గదా! అందువలన నీవు ఎల్ల నదీమ తల్లులకు జ్యేష్ఠవుగా లోకఖ్యాతి గడించియున్నావు. కావున నిను ధరించిన ఆ కపర్దీశ్వరుని యందలి భక్తిచే, తత్ప్రీతికరముగా నేను నీయందు వచ్చి నిలుతును.

అడనిని వల్లెయని గౌతమి, పుష్కరు నాజ్ఞగొని, నిజస్థానమున కరిగెను. అదిమొదలుగ పుష్కరము తనమాట దప్పక, బృహస్పతి సింహరాసి గతుడై నప్పుడు వచ్చి గౌతమిలో పండ్రెండునాళ్ళు నిలుచుచున్నది. అట్లు పుష్కరము వచ్చి గౌతమిలో నిలిచిన ఆసమయము గౌతమీపుష్కరయోగమహా పర్వమని పిలువబడుచున్నది.

బృహస్పతి సింహరాశిగతుడై యున్న సంవత్సరమంతయు నొక్కనాడేని తప్పక గౌతమీ గంగలో గావింపబడిన స్నానాది విధానములకు కోటిగుణితముగా ఆపుష్కరము నిలిచిన పండ్రెండు నాళ్ళలో ఒక్కొక్కనాటి స్నానాది విధానములకు జనులు ఫలములను గొనుచున్నారు.

అట్టి గౌతమీ పుష్కర సమయమున గౌతమీగంగ యందు స్నానాదుల నాచరించి, పితృదేవతలను గొలిచి, బ్రాహ్మణుల నర్చించి, శక్తివంచనలేక దానముల నాచరించు వారల పుణ్యము లగణ్యములు.

ఆ సమయమున దానవిధి యీ విధముగా జెప్పబడి యున్నది :- మొదటినాడు బంగారమును, వెండిని, ధాన్యమును, భూమిని దానము చేయవలెను. రెండవనాడు వస్త్రములు, లవణము, గోవులు, రత్నములు దానమీవలెను. మూడవనాడు బెల్లము, శాకములు, ఫలములు, కూష్మాండములు దానమీవలెను. నాలుగవనాడు నేయి, తిలతైలము, తేనె, పాలు మున్నగునవి దానము చేయవలెను. ఐదవనాడు ధాన్యముతో నిండిన బండి, పాడిబఱ్ఱెలు, ఎద్దులు, నాగలి దానమీవలెను. ఆఱవనాడు ఔషధములు, కర్పూరము, కస్తూరి, చందనము మున్నగు సుగంధద్రవ్యములు దానము చేయవలెను. ఏడవనాడు గృహము, పీట, శయ్య, ఆందోళిక (మేనా), ఛత్రము, చామరము మున్నగునవి దానమీవలెను. ఎనిమిదవనాడు గంధపు చెక్క, పుష్పమాలలు, ముత్యాలహారములు దానము చేయవలెను. తొమ్మిదవనాడు పితృదేవతలకు శ్రాద్ధములు సపిండ

ములుగా నిర్వర్తించి, తగు దక్షిణలు, ఫలములు, మడులు, మాన్యములు, కన్యను దానము చేయవలెను. పదవనాడు ఉమామహేశ్వరులను, లక్ష్మీనారాయణులను, వాణీహిరణ్యగర్భులను పూజించి, భక్తియుక్తముగా తమ శక్తికి దఱుగకుండ సకలవిధ దానములు చేయవలెను. పదునొకండవనాడు బ్రాహ్మణుల నర్చించి, వస్త్రాదు లొసగి, వారికి వాయనము లర్పించవలెను. పండ్రెండవనాడు యథావిధి స్నానసంధ్యాదులు గావించి, పుణ్యాలగు బ్రాహ్మణ దంపతులను బూజించి, వారికి సమస్తదానములు గావించి, వారి ఆశీర్వాదములను పొందవలెను.

ఈవిధమున బృహస్పతి సింహరాశిగతుడైన సమయమున గౌతమీపుష్కరమును సేవించువారిపుణ్యము అగణ్యము. అది చతుర్ముఖుడనగు నాకుగాని, వేయిముఖములుగల ఆదిశేషునకుగాని వర్ణింప నలవిగానిది. అని బ్రహ్మ స్వయముగా తన మానసపుత్రుడగు నారదున కెఱిగించెను. —బ్రహ్మాండపురాణము

# గోదావరీపుష్కర స్నానవిధి

ఆచమ్య, ప్రాణానాయమ్య...తిథౌ...ప్రీత్యర్థం సింహంగతే దేవగురౌ సార్థత్రికోటి తీర్థసహిత పుష్కర ప్రయుక్త శ్రీగోదావరీస్నాన మహం కరిష్యే, ఇతిసంకల్ప్య.

శ్లో॥ పిప్పలాదా త్సముత్పన్నే కృత్తే లోకే భయంకరే,
మృత్తికాంతే మయాదత్తం ఆహారార్థం ప్రకల్పయ॥

ఈ శ్లోకము చదువుచు మూడుమారులు మృత్తికను గోదావరిలో వేయవలయును.

గోదావరీ ధ్యానము;—

శ్లో॥ గోదావరీతి యోబ్రూయాత్ సప్తజన్మార్జితా న్యపి,
మహాపాపాని నశ్యంతి విష్ణులోకం సగచ్ఛతి॥
పుష్యార్కే జన్మనక్షత్రే వ్యతీపాతే దినత్రయే,
సకృద్గోదావరీస్నానం కులకోటిం సముద్ధరేత్॥
రేవాతీరే తపః కుర్యాత్ మరణం జాహ్నవీ తటే,
దానం దద్యా త్కురుక్షేత్రే గౌతమ్యాం త్రితయం వరమ్॥
పావనిత్వం జగత్పూజ్యే సర్వతీర్థ మయే శుభే,
త్వయి స్నాన మనుజ్ఞాం మే దేహి గోదావరీ నది॥
సింహంగతే దేవగురౌ పితౄణాం తారణాయచ,
సర్వపాప విముక్త్యర్థం తీర్థస్నానం కరోమ్యహమ్॥
తీర్థరాజ నమస్తుభ్యం సర్వలోకైక పావన!
త్వయి స్నానం కరోమ్యద్య భవబంధ విముక్తయే॥
సింహేగురౌ గౌతమి దేవి భద్రే బ్రహ్మాండభాండేపిచ యాని సంతి,
దివ్యంతరిక్షే భువి నాగలోకే సర్వాణి తీర్థాని తవోదరేస్యుః॥
తీర్థాని నద్యశ్చ తథాసముద్రాః క్షేత్రాణ్యరణ్యాని తథాశ్రమాశ్చ
వసంతి సర్వాణి చ సర్వరూపా గోదావరీ సింహగతే సురేజ్యే॥
శ్లో॥ నమో గోదావరీ దేవి మహాదేవస్య వల్లభే,
స్నానే నానేన మే పాపం హర శ్రీహరిపుత్రికే॥
మహాపాతక కోటీని బహు జన్మార్జితా న్యపి,
హర్తుం త్వత్తోధికా దేవి నాన్యాస్తీహ సరిద్వరే॥

స్నానాత్త్రిసప్త మనుజాన్ పితృమాతృ కులోద్భవాన్,
ముక్తిం ప్రాపయితుం గంగే త్వత్సమీప ముపాగతః॥
తస్మా ద్గోదావరీ దేవి త్వయి స్నానం కరోమ్యహమ్,
అనేన విధినా స్నానం గోదావర్యాం సమాచరేత్॥

ఈ విధముగా గోదావరిధ్యానము చేసి మొదటిస్నానము చేయవలయును. మరల సంకల్పముచేసి,

శ్లో॥ సింహంగతే దేవ గురౌ తీర్థరాజాన్వితే మతే,
త్వయిస్నానం కరోమ్యద్య గోదావరి సరిద్వరే.

ఈ మంత్రము చెప్పి రెండవ స్నానము చేయవలయును. తతః శరీరశుద్ధ్యర్థం అఘమర్షణ స్నానమహం కరిష్యే, ఇతి సంకల్ప్య, ఆపోహిష్ఠామయోభువేత్యాది పంచాఘమర్షణాను వాకములు పఠించుచు, మార్జన చేసికొని —

శ్లో॥ మమ దేహ విశుద్ధ్యర్థం అఘమర్షణ మంత్రతః,
గోదావరి మహాదేవి త్వయి స్నానం కరోమ్యహమ్.

ఈ మంత్రముచెప్పి మూడవమారు స్నానము చేయవలయును. తతః పితౄన్ సముద్దిశ్య, దక్షిణాభిముఖుడై పితృతర్పణముచేసి, తూర్పుగ తిరిగి సవ్యముగ మరలస్నానము చేయవలయును. పిమ్మట త్రిచవిధానముతో (యథావకాశముగ) సూర్యుని కర్ఘ్యమిచ్చి, మరల స్నానము చేయవలయును.

శ్లో॥ గౌతమ్యై తీర్థరాజాయ ధిషణాయాథ విష్ణవే,
శివాయ సర్వదేవేభ్యో మునిభ్యో హ్యర్ఘ్యాణి కారయేత్॥

మరల సంకల్పముచేసి, ఏవంగుణ.........సిద్ధ్యర్థం, సింహంగతే దేవగురౌ సార్థత్రికోటితీర్థసహిత, పుష్కరప్రయుక్త శ్రీ మహాగోదావర్యాః మధునా, మయాకృత స్నాన సాద్గుణ్య సిద్ధ్యర్థం గోదావరీ తీర్థరాజ జీవ హరి, హర, సుర, మునిభ్యః ప్రత్యేక ప్రత్యేకం సకృత్సకృత్ప్రసన్నార్ఘ్య ప్రదానాని కరిష్యే, ఇతిసంకల్ప్య — గోదావరీ ప్రవాహాభిముఖో భూత్వా (ప్రవాహమున కెదురుగ నిలబడి, అర్ఘ్యము లీయవలయును.)

శ్లో॥ గోదావరీ మహాదేవి సర్వపాప హరే మలె,
స్నానసాద్గుణ్య సిద్ధ్యర్థ మిద మర్ఘ్యం దదామ్యహమ్.
గోదావర్యై నమః ఇదమర్ఘ్యం సమర్పయామి

శ్లో॥ తీర్థరాజ మహాభాగ! సర్వతీర్థ సమావృత,
ఇదమర్ఘ్యం మయా దత్తం గృహాణవరదోభవ.
తీర్థరాజాయనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ బృహస్పతే సురాధ్యక్ష! సర్వదేవ నమస్కృత,
ఇదమర్ఘ్యం ప్రదాస్యామి సంగృహాణ మహామతే.
బృహస్పతయేనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ శ్రీరమానాథ! శ్రీవిష్ణో! గంగోద్భవ పదాంబుజ
సంగృహాణ జగన్నాథ! ఇదమర్ఘ్యం దదామ్యహమ్.
విష్ణవే నమః......సమర్పయామి.

శ్లో॥ ఉమానాథ! మహాదేవ! గంగాధర! మహేశ్వర!
ఇద మర్ఘ్యం మయాదత్తం సంగృహాణ త్ర్యంబక!
శివాయనమః......సమర్పయామి.

శ్లో॥ బ్రహ్మేంద్రాగ్ని ముఖాస్సర్వే సురాః పుణ్యఫలప్రదాః
ఇద మర్ఘ్యం ప్రదాస్యామి గృహ్ణంతు విధినా ధునా.
బ్రహ్మాది సర్వదేవేభ్యోనమః......సమర్పయామి.

శ్లో॥ తుల్యాత్రేయా భరద్వాజో గౌతమో వృద్ధగౌతమః,
విశ్వామిత్రో వసిష్ఠశ్చ గృహ్ణం త్వర్ఘ్యం దదామ్యహమ్॥
వశిష్ఠాది మునిభ్యో నమః......సమర్పయామి.

అథ ధర్మార్ఘ్యములు:—

శ్లో॥ భార్యా పతి విహీనాశ్చ అగ్ని సంస్కార వర్జితాః,
వహితాః ప్రేతరూపేణ అంతరిక్షే ప్రలంబితాః॥

అగ్నినా భృగుపాతేన ఉద్బంధేన జలేనవా,
దంష్ట్రిభి ర్దంశభి శ్చైవ శస్త్రేణ గరళేనవా॥
చోరాంత్యజాతిభి శ్చైవ అన్యై శ్చాపి హతాశ్చయే,
కులద్వయే మదీయేచ యే చాన్యే గతివర్జితాః॥
తేషా ముద్ధరణార్థాయ సింహాయుక్తే బృహస్పతౌ,
శ్రీగౌతమ్యాం మహాపుణ్య జలేనార్ఘ్యం మయార్పితమ్॥

అర్ఘ్యాంతే అవగాహనస్నానం కుర్యాత్ (మరల స్నానము చేయవలయును) శుద్ధాచమనం కృత్వా,

శ్లో॥ శ్రీ గౌతమి మహాదేవి స్నానకాలే మయాధునా,
పాదాభ్యాం యత్కృతం పాపం జలస్పర్శన రూపకం॥
తత్సర్వం క్షమ్యతాం గంగే కృపయా భక్తవత్సలే,
యన్మయా దూషితం తోయం శారీర మలసంయుతమ్॥

శ్లో॥ తస్య పాపవిముక్త్యర్థం యత్త్రిణాం తర్పయామ్యహమ్,
ఇతి గౌతమీతటే త్రీణి, అంజలిఉదకాని ప్రక్షిపేత్॥

శ్లో॥ స్నానాంతే దక్షిణాం దద్యాత్ బ్రాహ్మణేభ్య స్స్వశక్తితః,
స్నానసా ద్గుణ్యసిద్ధ్యర్థం నదీతీరేషు మానవాః॥

దానధర్మములు శక్తికొలది చేయవలయును. ఈపుష్కర సమయమున చేయు దానధర్మములకు కోటిగుణితఫలము గలదు. పిమ్మట పితృశ్రాద్ధ మాచరించవలయును, పిమ్మట గోదావరీ పూజ. (స్త్రీలు తప్పక చేయవలయును.)

## గోదావరీ పూజాకల్పము

ఆచమ్య, కేశవాయ నమః . . . . . ప్రీత్యర్థం చతుర్విధ పురుష ఫలప్రాప్త్యర్థం, మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం సార్ధత్రికోటీ తీర్థసహిత గోదావరీ పుష్కర మహాపర్వపుణ్యకాలే కల్పోక్త ప్రకారేణ సర్వోపచారైః శ్రీగోదావరీ పూజాం కరిష్యే. ఆదౌ గణపతిపూజాం కలశపూజాంచ కరిష్యే.

ధ్యానం:- పద్మాసనాం పద్మపత్రాక్షీం పద్మగర్భ స్వరూపిణీం,
చింతయే త్పద్మచరణాం పద్మాసన నివేశినీమ్॥

చతుర్భుజాం సువర్ణాభాం వరదాం పద్మధారిణీమ్,
క్షౌమయుగ్మ పరీధానాం రక్తకుంకుమ ధారిణీమ్॥

దివ్యకర్పూర గంధాఢ్యాం శ్వేతచందనచర్చితామ్,
లసన్మంజీర చరణాం క్వణత్కనక కంకణామ్॥

నానారత్నమయాభాఢ్యాం లసన్మకుట ధారిణీమ్,
ముక్తామాణిక్య సమ్మిశ్ర దివ్యాభరణ భూషితామ్॥

శ్లో॥ శ్వేతాంబరాం శ్వేతవర్ణాం శ్వేతమాల్యాను లేపనామ్,
త్రిశ్యాం మాంససమారూఢాం ప్రసన్నాస్యాం సురేశ్వరీమ్॥
చక్రం త్రిశూలం పరశు మక్షమాలాంచ బిభ్రతీమ్,
పవిత్రాం పాపశమనీం బ్రహ్మ విష్ణు శివాత్మికామ్॥
సార్ధత్రికోటీ తీర్థసహిత పుష్కరప్రయుక్త
శ్రీ మహాగోదావర్యైనమః ధ్యాయామి.

శ్లో॥ అఘక్షయకరే దేవి! చంద్రచూడప్రియే మతే,
నిజరూపం సమాదాయ సమాగచ్ఛ ప్రశోభనే॥
సార్థ......ఆవాహనం సమర్పయామి.

శ్లో॥ అనంతదివ్యసంకాశ మనంతాఖ్య మహాసనం,
అనంతరత్నఖచిత మనర్ఘం ప్రతిగృహ్యతామ్॥
సార్థ......సింహాసనం సమర్పయామి.

శ్లో॥ లోకవంద్యే సోత్తమాంగే శంకరః స్వేబిభర్తియాం,
పాద్యం గృహాణభో గంగే పాపభంగే భయాపహే॥
సార్థ......పాద్యం సమర్పయామి.

శ్లో॥ సపత్నీభవ మాహాత్మ్యే కవితాకార భాసురే,
గృహాణార్ఘ్యం మయాదత్తం బ్రాహ్మణ ప్రాణధారిణి॥
సార్థ......అర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ త్వదుద్భవం మహాపుణ్యం అమృతం హ్యమృతోపమమ్,
గృహాణాచమనం గంగే కృపయా భక్తవత్సలే॥
సార్థ......ఆచమనీయం సమర్పయామి.

శ్లో॥ దధిమధ్వాజ్య సంయుక్తం శర్కరా క్షీరసంయుతమ్,
మధుపర్కం ప్రదాస్యామి గృహాణ పరమేశ్వరి॥
సార్థ......మధుపర్కం సమర్పయామి.

శ్లో॥ క్షీరోదధి సముద్భూతం క్షీరస్నానార్థ ముత్తమమ్,
అమృతందధి మధ్వాజ్యం స్వీకురుష్వ మయార్పితమ్॥
సార్థ......పంచామృతస్నానం సమర్పయామి.

శ్లో॥ శుద్ధార్ణవ సముద్భూతం మయార్పిత మిదంజలమ్,
స్నానంకురు మహాదేవి గోదావరి నమోస్తుతే॥
సార్థ......శుద్ధోదకస్నానం సమర్పయామి.
స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్లో॥ లసత్ క్షౌమయుగం దేవి గుణాతీతేనుకంపయా,
మయోపనీతం సుభగే గృహాణ పరమేశ్వరి॥
సార్థ......వస్త్రయుగ్మం సమర్పయామి.

శ్లో॥ కంచుకం పరమం దివ్యం మణి స్వర్ణ విచిత్రితం,
మయార్పిత మిదం దేవి గోదావరి నమోస్తుతే॥
సార్థ......కంచుకం సమర్పయామి.

శ్లో॥ సుసూత్రం గ్రంధి మద్దివ్యం పవిత్రం పరమం శుభమ్,
గృహాణ కంఠ భూషాఢ్యాం గంగే గంగాధరప్రియే॥
సార్థ......ఉపవీతం సమర్పయామి.

శ్లో॥ ఘనసారాది మిళితం కజ్జలం మంగళప్రదమ్,
మయార్పిత మిదం దేవి సంగృహాణ సరిద్వరే॥
సార్థ......కజ్జలం (కాటుక) సమర్పయామి.

శ్లో॥ ఆలోల మౌక్తికాయుక్తం స్వర్ణచక్రావృతం శుభమ్,
తిలకం ధారయిష్యామి కుంకుమాన్విత ముత్తమమ్॥
సార్థ......కుంకుమం సమర్పయామి.

శ్లో॥ కస్తూరీతిలకం దేవి మయాదత్తం శుభప్రదమ్,
గోదావరి నమస్తుభ్యం సంగృహాణ మహేశ్వరి॥
సాక్ష......కస్తూరీతిలకం సమర్పయామి.

శ్లో॥ హరిచూర్ణం సుగంధాఢ్యం పుష్పసార సమన్వితమ్,
తుభ్యం దాస్యామ్యహం భక్త్యా సంగృహాణ సరిద్వరే॥
సాక్ష......హరిద్రాచూర్ణం సమర్పయామి.

శ్లో॥ దర్పణం దర్శయామ్యద్య విలోకయ శుభప్రదమ్,
వజ్రాభం కృపయా దేవి గోదావరి సరిద్వరే॥
సాక్ష......దర్పణం (అద్దము) దర్శయామి.

శ్లో॥ పుష్పహారం ప్రదాస్యామి మందారాది సమన్వితం,
మలయాద్రిసముద్భవం దేవి గృహాణ పరమేశ్వరి॥
సాక్ష......పుష్పహారం సమర్పయామి.

శ్లో॥ కిరీటం కాంచి కేయూర హార సౌవర్ణ కంకణాన్,
అంగుళీయకరత్నాని దాస్యామి ప్రతిగృహ్యతామ్॥
సాక్ష......ఆభరణాని సమర్పయామి.

శ్లో॥ అక్షతాన్ కుంకుమోపేతాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్
కర్పూరాగరుసంయుక్తాన్ దాస్యామి ప్రతిగృహ్యతామ్॥
సాక్ష ... ... అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ మల్లికా జాజి కుసుమై శ్శతపత్రై ర్మనోరమైః,
గంగేయమయోపనీతాని పుష్పాణి ప్రతిగృహ్యతామ్॥
సాక్ష ... ... పుష్పాణి సమర్పయామి.

అథాంగ పూజ:- అమృతచరణాయై నమః - పాదౌ పూజయామి, సుభగాయై నమః-జానునీ పూజయామి, సుజంఘా

యైనమః-జంఘేపూజయామి, రంభోర్వైనమః- ఊరూపూజయామి చక్రకట్యైనమః - కటింపూజయామి, తనుమధ్యాయైనమః - మధ్యం పూజయామి, విశాలవక్షసే నమః-వక్షస్థలంపూజయామి, ఉత్తుంగ స్తన్యైనమః - స్తనౌపూజయామి, అనంతబాహవేనమః- బాహూన్ పూజయామి, అబ్జపాణ్యైనమః - హస్తౌపూజయామి, కంబుకంఠ్యైనమః - కంఠం పూజయామి, బింబోష్ఠ్యైనమః - ఓష్ఠౌపూజయామి, సుభాషిణ్యైనమః - వక్త్రంపూజయామి, త్రిలోచన్యైనమః - నేత్రాణిపూజయామి, సునాసాయైనమః - నాసికాంపూజయామి, అపాంగదృశేనమః - భ్రూమధ్యంపూజయామి, శ్రీకర్ణాయైనమః-కర్ణౌపూజయామి, అబ్జాననాయైనమః- లలాటంపూజయామి, ఉన్నత శిరసేనమః - శిరఃపూజయామి, చంద్రమౌళిజటావాసిన్యైనమః- కేశాన్ పూజయామి, యుక్తకచాయైనమః - కచం పూజయామి, శ్రీ గోదావర్యైనమః - సర్వాణ్యంగాని పూజయామి.

## అథ గోదావరీ శ్రీకారాష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందట "ఓం శ్రీ" అనియు, చివర "నమః" అనియు చేర్చి చెప్పవలయును.

ఓం శ్రీ గంగాయైనమః
ఓం శ్రీ మహాదేవ్యైనమః
ఓం శ్రీ కర్యైనమః
పరిగ్రహాయై
గౌతమ్యై
భవాన్యై
మాత్రే
జయాన్వితాయై
శాంకర్యై
శర్వాణ్యై
శివాయై
ధురంధరాయై

దుర్గాయై
పదాంభోజాయై
శ్రీమత్త్రిపురసుందర్యై
శాక్త్యై
విశాలాక్ష్యై
విద్యాయై
పరాయై
శ్రియై
మానిన్యై
కరాబ్జాయై
శ్రీమత్సింహాసనేశ్వర్యై
వక్షసే
పరిజ్ఞాత్రే
ప్రదాయై
శ్రీమదిందిరాయై
చక్రధారిణ్యై
శ్రీమద్బాలాయై
పరమేశ్వర్యై
చక్రరాజనిలయాయై
కర్ణాయై
పతివ్రతాయై
శ్రీమద్గోదావర్యై
శ్రీమదనంతఫలదాయిన్యై
బీజాయై

కరాదర్శాయై
జయాయై
విరాజితాయై
మూలాయై
శ్రీమత్యై
శ్రీమదాపగాయై
శ్రీమదంబికాయై
గుణాయై
నఖాయై
శ్రీమదలకాయై
కుచద్వయ్యై
దంతాయై
కచాయై
శ్రీమద్భ్రూమధ్యాయై
వసుంధరాయై
త్రోయాయై
ముఖాయై
నికేతనాయై
విలాసిన్యై
భవరోగాయై
శ్రీమదంబాయై
సింహాసనస్థితాయై
జంఘాయై
భగాయై

శ్రీమత్కటిచక్రవిరాజితాయై
మధ్యాయై
మహానాసాయై
దృశాయై
మనోరథాయై
నాభ్యై
మహోదీప్తాయై
బాలాయై
మహామతాయై
భూషణాయై
శతాంగాయై
జితాయై
స్మితాననాయై
శ్రీమదాగమ సంవేద్యాయై
వేదాన్తప్రదీపకాయై
చంద్రశేఖర జటాజూటాంతర
నివాసిన్యై
భద్రాసనమధ్యస్థాయై
వీణాగానలోలుపాయై
శ్రీమచ్చిత్రాంబరధరాయై
శ్రీమత్కంచుకధారిణ్యై
శ్రీమంత్రరాజఫలదాయై
శ్రీమద్గిరివరాత్మజాయై
శ్రీమదద్భుతచారిత్రాయై
శ్రీవత్సాంకితవక్షసే
శ్రీమత్కాంచన పుష్పాభి
నాసికాయై
మనోహరాయై
నిగ్రహాయై
విశేషాయై
భాషాయై
ధరాత్మజాయై
నారాయణపదాబ్జ
మరందాయై
కరార్చితాయై
గౌతమాఘసంహర్త్ర్యై
భూనీలాది సంస్తుతాయై
ఖేచర్యై
పురాణ్యై
శ్రీమద్భూషణభూషితాయై
శ్రీమత్పండితసంపూజ్యాయై
దివ్యామృతవాహిన్యై
శ్రీమన్మునిసతీబృందసేవితామల
పాదుకాయై
శ్రీమత్సురాంగనాబృంద
సత్కాలింగితతరంగాయై
శ్రీమద్గోహత్యాది పాపౌఘ
హారిణ్యై

మహానద్యై
మాతృసంగపాపఘ్న్యై
స్త్రీహత్యాఘనివారిణ్యై
గౌతమతపోయోగ సమాగత
మహానద్యై

వసిష్ఠాది మునిభిస్తథా
పరికల్పిత సాగరాన్వితాయై
శ్రీమద్గోదావరీ పుణ్యాహ్వాయ
దివ్యమహానద్యై
శ్రీమద్గోదావర్యై నమః

నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి.

శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం సుగంధంచ మనోహరమ్,
గోదావరి నమస్తుభ్యం ధూపోయం ప్రతిగృహ్యతామ్॥
సార్థ ... ... ధూపమాఘ్రాపయామి.

శ్లో॥ ఘృతవర్తి యుతం దీప మంధకార వినాశనమ్,
గృహాణ మంగళం దేవి సర్వేశ్వరి నమోస్తుతే॥
సార్థ......దీపం దర్శయామి.

శ్లో॥ సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైషడ్భి సమన్వితమ్,
అనేకఫల సంయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్॥
సార్థ......నైవేద్యం సమర్పయామి.

శ్లో॥ శుద్ధోదకం సుపాత్రస్థం శుద్ధార్ణవ సముద్భవమ్,
పూర్వాపోశన కర్మార్థం గృహాణ హరి పుత్రికే॥
సార్థ......పూర్వాపోశనం సమర్పయామి.

శ్లో॥ పానీయం పావనం శ్రేష్ఠం గంగాది సరిదుద్భవమ్,
గోదావరి నమస్తుభ్యం దాస్యామి ప్రతిగృహ్యతామ్॥
సార్థ......పానీయం సమర్పయామి.

శ్లో॥ గంగోదకం మయానీతం నిర్మలం పరమం శుభమ్,
ఉత్తరాపోశనార్థంచ గౌతమి ప్రతిగృహ్యతామ్॥
సార్థ ... ... ఉత్తరాపోశనం సమర్పయామి.

శ్లో॥ కించిదుష్ణోదకం శ్రేష్ఠం దాస్యామి హరిపుత్రికే,
కరపాద ప్రక్షాలనార్థం సంగృహాణ సరిద్వరే॥
సార్థ ... ... కరపాద ప్రక్షాళనం సమర్పయామి.

శ్లో॥ కర్పూరవాసితం చూర్ణం క్రముకాద్యై స్సమన్వితమ్,
నాగవల్లీ దళై ర్యుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥
సార్థ ... ... తాంబూలం సమర్పయామి.

శ్లో॥ అనంతవర్తి సంయుక్తం వహ్నినాయోజితం ప్రియమ్,
కర్పూరజ్యోతి రన్వితం గౌతమి ప్రతిగృహ్యతామ్॥
సార్థ ... ... నీరాజనం దర్శయామి.

శ్లో॥ అక్షతాన్ సుహరిద్రాంశ్చ మల్లికాది సమన్వితాన్,
పుష్పాంజలిం ప్రదాస్యామి గోదావరి నమోస్తుతే॥
సార్థ ... ... మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥
పాపోహం పాపకర్మాణాం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవి శరణాగతవత్సలే॥
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్షో మహేశ్వరీ॥
సార్థ ... ... ప్రదక్షిణం సమర్పయామి.

శ్లో॥ నమస్తే శ్రీమహాదేవి గోదావరి సరిద్వరే,
మయాకృత ప్రణామాని స్వీకురు శ్రీమహేశ్వరి॥
సార్థ ... ... సాష్టాంగప్రణామాని సమర్పయామి.

శ్లో॥ గంధపుష్పాక్షతైర్యుక్తం కుంకుమాన్విత ముత్తమమ్,
ప్రసన్నార్ఘ్యం మయాదత్తం సంగృహాణ సరిద్వరే.

సార్ధ ... ... ప్రసన్నార్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ నృత్యగీతాదికాంశ్చైవ పురాణపఠనాదిభిః,
రాజోపచారై ర్బహుభిః సంగృహాణ మహానది॥

సార్ధ ... ... రాజోపచారాన్ సమర్పయామి.

శ్లో॥ సువస్త్రం కంచుకోపేతం ఫలాది వ్యంజనాన్వితమ్,
శూర్పదానం కరిష్యామి త్వత్ప్రీత్యై పరమేశ్వరి॥

శూర్పవాయన దానం (మూసివాయనం) యీయవలెను.

శ్లో॥ సువాసిన్యై యథాశక్త్యా దానసాద్గుణ్య సిద్ధయే,
దక్షిణాంచ దదామ్యంబ ప్రసాదంకురు సర్వదా॥

దక్షిణ యివ్వవలయును.

శ్లో॥ యస్యాః స్మృత్యాచనామోక్త్యా తపః పూజాక్రియాదిషు,
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమీశ్వరీం॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సరిద్వరే,
యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుమే॥

అనయాధ్యానావాహనాది సర్వోపచార పూజయాచ భగవతీ సర్వాత్మికా శ్రీగౌతమీ మహాగంగా దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు.

—♦—

# రాజమండ్రి

ఆంధ్రదేశమున నీనగరము మిక్కిలి పురాతనముగను, నవీనముగను ప్రసిద్ధమైనది. పూర్వమీ నగరరాజమును రాజధానిగా జేసికొని, విమలాదిత్య తనయుడు, ఆంధ్రభాషోద్ధారకుడు నగు రాజరాజనరేంద్రుడు, 11 వ శతాబ్దమున నాంధ్రదేశమును పరిపాలించి యుండెను. ఆదికవి, వాగనుశాసనుడు నగు నన్నయభట్టారకుడు భారతమును నాంధ్రీకరించిన మహనీయుడు యాతని యాస్థానముననే విద్వత్కవియై విరాజిల్లెను. నాటి నుండియు నీనగరము రాజకీయముగనే గాక పాండితీవిషయమున గూడ సకలాంధ్రదేశ రాజధానియై వెలుగొందెను. 15 వ శతాబ్దమున నీనగరము రెడ్డిరాజుల పాలనమందుండెను. ఆసమయమున కవిసార్వభౌముడగు శ్రీనాథుడు వీరభద్రారెడ్డి, వేమారెడ్ల యాస్థానమున కవియై 'కాశీఖండము' ఆతని కంకితమిచ్చి, రాజమహేంద్రనగర వైభవమును తన భీమఖండమున నధికముగ వర్ణించియుండెను.

కోట:— పూర్వమిచట నొక కోటగలదు. క్రమముగ నది కాలగర్భమున లీనమయ్యె. కాని సూక్ష్మదృష్టిచే పరిశీలించిన నేడు దాని శిథిలములు మాత్ర మచ్చటచ్చట గాన్పించును.

రాజమహేంద్రవరము పరమ పావనమైన గౌతమీ తీరమున గలదు. ఇచట గోదావరి పొడవునను రేవులు గలవు. కోటిలింగాలు, పుష్కరఘట్టము, మార్కండేయ ఘట్టములు ప్రధానములు. పుష్కర ఘట్టమున జలచరముల బాధయుండదని బ్రహ్మ వరమిచ్చెను. పై ఘట్టముల గొప్పతనము, గౌతమీ

# మా గ్రంథములు

| | |
|---|---|
| భగవన్నామ ప్రభావము | 0- 6-0 |
| శ్రీరామ పూజావిధానము | 0- 4-0 |
| శ్రీరామనామ ప్రభావము | 0- 6-0 |
| నవవిధ భక్తులు | 1- 8-0 |
| సంకీర్తన మీమాంస | 1- 0-0 |
| కలిసంతరణోపనిషత్తు | 1- 0-0 |
| పరమార్థ తత్త్వము | 0-12-0 |
| బ్రహ్మచర్యము | 0- 6-0 |
| తత్త్వత్రయము | 0- 4-0 |
| అర్థపంచకము | 0-12-0 |
| భాగవతకథ 1-వ భాగము | 2- 0-0 |
| చైతన్య చరిత్రావళి 1-వ భాగము | 2- 8-0 |
| మహాసంకీర్తనము | 0- 8-0 |

## అచ్చుకానున్న గ్రంథములు

భాగవతకథ 2, 3, 4, 5, 6, 7, 8, 9 భాగములు

ఉడియా బాబాజీ ఉపదేశములు 1, 2 భాగములు

శ్రీరామ పటము

ప్రణవ ప్రభావము

శ్రీరామ మంత్రానుష్ఠానము (200 పేజీల గ్రంథము)

ధ్యానపద్ధతి

సాధన క్రమము (ప్రథమ సోపానము)

ప్రతులకు:— శ్రీ రామ శరణ మందిరం, బుద్ధాం

కర్లపాలెం పోస్టు, — (వయా) పొన్నూరు.

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| అష్టాదశ శ్లోకగీత | 0_12_0 |
| అర్థపంచకము | 0_12_0 |
| ♦ ఆశ్వినమాహాత్మ్యము | 2_ 0_0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0_ 3_0 |
| ఉపాసనీబాబా జీవితము | 1_ 8_0 |
| కల్యాణకుంజము | 1_ 4_0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణ వివేకానందులు) | 1_ 0_0 |
| గీతాప్రతిభ ( 2వ కూర్పు ) | 0_12_0 |
| గీతాకదంబము ౧వ దళము | 1_ 4_0 |
| ,, ౨వ దళము | 1_ 4_0 |
| గోవిందదామోదరస్తోత్రము | 0_ 8_0 |
| జడభరతుడు | 0_12_0 |
| * నరసదాసు కీర్తనలు | 0_10_0 |
| పరమసాధన (2వ కూర్పు) | 0_12_0 |
| పరమార్థతత్త్వము | 0_12_0 |
| పద్మపురాణము(ఆదిమఖండం) | 1_ 8_0 |
| ,, (భూమిఖండము) | ?_ 0_0 |
| ,, (బ్రహ్మఖండము) | 1_ 0_0 |
| బదరీయాత్ర (౩వ కూర్పు) | 1_ 0_0 |
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0_ 4_0 |
| భక్తితత్త్వము | 0_12_0 |
| భక్తిరసాయనము | 2_ 0_0 |
| భారతీయ తత్త్వశాస్త్రము | 2_ 0_0 |
| ♦ భాగవతకథ | 2_ 0_0 |
| భారతీయదర్శనము (ప్ర.ఖం.) | 1_ 8_0 |
| * మానవధర్మము | 1_ 0_0 |
| * ముక్తిగీత | 0_ 6_0 |
| రాధారహస్యము (40 గ్రంథములసారము) | 1_ 4_0 |
| * శ్రీరామపూజా విధానము | 0_ 4_0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0_ 8_0 |
| * శ్రీసీతారామ శతకము | 0_ 2_0 |
| * శ్రీత్యాగరాజ చరిత్ర | 0_ 4_0 |
| * శ్రీరామనామ ప్రభావము | 0_ 6_0 |
| శ్రీశుకుడు | 0_12_0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0_ 4_0 |
| * సప్తమహావ్రతములు | 0_ 6_0 |
| సిద్ధాంత కల్పవల్లి | 1_ 0_0 |
| సంకీర్తన మీమాంస | 1_ 0_0 |
| హరినామ మహిమ శతకము | 0_ 4_0 |
| * హిందూకోడ్ బిల్ సమీక్ష | 1_ 0_0 |

షరా:_ రు 1 కు లోపు వి. పి. లేదు. రు 5/_ లకు మించిన ఆర్డరుకు రు 1 కి 0_3_0, రు 25/_ లకు రు 1 కి 0_4_0 లు, రు 100/_ లకు రు 33_0_0 లు, కమీషను యివ్వబడును సమర్థులగు ప్రచారకులు కావలయును.

* ఈగుర్తుగలవి కొలదిప్రతులే గలవు. ♦ వీటికి కమీషను యివ్వబడదు.

☞ పై గ్రంథములన్నియు ఒకసెట్టు తీసుకొనిన సగముధరకే యివ్వబడును. ముందుగ రు 4/_లు అడ్వాన్సు పంపాలి. ఈ అవకాశము కొలదిరోజులు మాత్రమే.

మీ ఆర్డరు వచ్చునప్పటికి ఉన్న గ్రంథములే పంపబడును. వి.పి. తీసికొన ప్రార్థన.